# KONDAREDDY BURUZU

# కొండారెడ్డి బురుజు

ENGLISH
తెలుగు



డా॥ ఎం. హరి కిషన్

కొండారెడ్డి బురుజు (Bilingual)


రచన : డా॥ ఎం. హరికిషన్
94410 32212

ముద్రణ: మే, 2015

ప్రతులకు: 1. జి. మాల్యాద్రి
కన్వీనర్, ప్రచురణల విభాగం
ప్లాట్ నెం: 162, విజయలక్ష్మి నగర్
నెల్లూరు - 524 004
సెల్: 94405 03061

2. డా॥ ఎం. హరికిషన్
45/205-1, టీచర్స్ కాలని,
కర్నూలు. సెల్: 94410 32212
email:drmharikishan@rediffmail.com
facebook page: kurnool photos

డి.టి.పి : టి. సాయిబాబ,
కర్నూలు. సెల్: 75698 88092

ముద్రణ:

వెల :


# KONDAREDDY BURUZU
# కొండారెడ్డి బురుజు

రచన

డా॥ ఎం. హరికిషన్

English Translation

M. Ram Mohan, B.E



కర్నూలు బుక్ ట్రస్ట్ జనవిజ్ఞాన వేదిక

The mentioning of the name ‘Kurnool’ immediately brings forth the image of Kondareddy Buruzu before our eyes as a flash. It is located in the heart of the city and keeps charming the people. Kurnool city looks very beautiful if seen from the top of Kondareddy Buruzu ascending it. Kondareddy Buruzu is one of the four Bastions (Buruzu) surrounding Kurnool city. Though the three Bastions (Buruzu) got destroyed, Konda Reddy Buruzu is one Bastion (Buruzu) which remained intact even today.



కర్నూలు పేరు చెప్పగానే మనందరి కళ్ళముందు తళుక్కున మెరిసేది కొండారెడ్డి బురుజు మాత్రమే. ఇది నగరం నడి బొడ్డులో వుండి అందరినీ ఆకర్షిస్తూవుంది. దీనిపైకెక్కి చూస్తే నగరమంతా అత్యంత సుందరంగా కనువిందు చేస్తుంది. కందనవోలు కోటకు నాలుగు వైపులా వున్న బురుజులలో కొండారెడ్డి బురుజు ఒకటి. మిగతా మూడు శిథిలమయిపోయినా నేటికీ చెక్కు చెదరకుండా నిలిచివున్నది కొండారెడ్డి బురుజు మాత్రమే.

One Bastion(Buruzu) among the three exists adjacent to victory theatre. This is called “Erra Burugu”. It got its name as it was constructed by red sand stone. In that, the temples of “Chinna Ellamma” and “Pedda Ellamma” are there. Very small pictures can be observed on the stones of “Erra Buruzu” walls.



శిథిలమైన ఆ మూడు బురుజులలో ఒకటి విక్టరీటాకీస్ పక్కన వుంది. దీనిని ఎఱ్ఱబురుజు అంటారు. ఎఱ్ఱని ఇసుకరాయిచే నిర్మించబడడంవల్ల దానికి ఆ పేరు వచ్చింది. అందులో చిన్న ఎల్లమ్మ, పెద్ద ఎల్లమ్మ దేవాలయాలు వున్నాయి. ఎఱ్ఱబురుజు గోడలపై అనేక చిన్నచిన్న బొమ్మలను బురుజు రాళ్ళపై మనం గమనించవచ్చు.

The remaining two Bastions (Buruzu) exist adjacent to “Thungabhadra” river. One exists crossing Kummari Street and another one exists beside Bungalow that is there in front of Saibaba temple. The soldiers would be guarding from this place to check the enemies who might enter the city crossing the river. In 1930, a picture of one bastion (Buruzu) was printed in “BHARATHI” magazine and the name ‘Ramanaidu Buruzu’ was mentioned below it. Probably, this might be one among these two Bastions (Buruzu). It’s a matter that has to be investigated upon.





మిగిలిన రెండు బురుజులు తుంగభద్రానదిని ఆనుకొని వున్నాయి. ఒకటి కుమ్మరి వీధిదాటాక, మరొకటి సాయిబాబా గుడిముందున్న బంగ్లా పక్కన వున్నాయి. నదిని దాటి శత్రువులెవరూ రాకుండా సైనికులు ఇక్కడ పహారా కాస్తుంటారు. 1930లో భారతి పత్రికలో కర్నూలులోని ఒక బురుజు చిత్రాన్ని ప్రచురిస్తూ దానికింద రామానాయుడి బురుజు అని రాశారు. బహుశా ఈ రెండు బురుజులలో ఒకదాని పేరు అది అయివుండవచ్చు. ఇది పరిశోధించాల్సిన అంశం

A lot of confusion exists among the historians regarding who constructed ‘Kondareddy Buruzu’, when it was constructed and how it got its name as any book and inscription containing this information is not available.



కొండారెడ్డి బురుజును ఎవరు కట్టించారు. అది ఎప్పుడు నిర్మించబడింది. దానికాపేరు ఎలా వచ్చింది అనే విషయాలను తెలిపే శాసనాలుగానీ, గ్రంథాలు గానీ ఏవీ లేకపోవడంతో ఈ విషయాలపట్ల చరిత్రకారుల్లో చాలా గందరగోళం నెలకొనివుంది.

It is known to us from a book called ‘A history of South India’ as this Kandanavolu Fort being given as a gift to Araveedu Ramaraju by Tuluva Veera Narasimha (Immadi Narasa Nayakudu is his another name) who had ruled Vijayanagara Kingdom between 1505-1509 A.C before Srikrishna Devaraya. The name ‘Kandanavolu Fort’ appears for the first time here only.



శ్రీకృష్ణదేవరాయలకన్నా ముందు క్రీ.శ. 1505–1509 మధ్య విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన తుళువ వీర నరసింహ (ఇతనికి ఇమ్మడి నరసనాయకుడు అనేది మరొక పేరు) కందనవోలు కోటను అరవీడు రామరాజుకు బహుకరించినట్లు “ఎ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా” అనే పుస్తకం ద్వారా తెలుస్తూవుంది. కందనవోలు కోట గురించి మొదట కనబడేది ఇక్కడే.

Bijapur Sultan, Yusuf Ali Khan crossed Tungabhadra river and attacked Kandanavolu. At that time, Araveedu Ramaraju stood support to Veera Narasimha in chasing away Bijapur Sultan and helped him in occupying Kandanavolu Fort and Adoni along with it.



With that, Vijaya Nagara King, Veera Narasimha felt very happy, showered praises on Ramaraju and gifted Kandanavolu to him. Some people think that it was Ramaraju who strengthened Kurnool Fort and built Kondareddy Buruzu.

బీజాపూర్ సుల్తానయిన యూసఫ్ ఆదిల్‌ఖాన్ తుంగభద్ర నదిని దాటుకొని కందనవోలుపై దండెత్తాడు. ఆ సమయంలో తుళువ వీర నరసింహునికి అండగా అరవీడు రామరాజు నిలబడి బీజాపూర్ సుల్తాన్‌ను పారద్రోలి కందనవోలు కోటతోబాటు, ఆదోనిని గూడా ఆక్రమించడానికి సహాయపడ్డాడు.

దానితో విజయనగర ప్రభువైన వీర నరసింహుడు రామరాజును మెచ్చుకొని కందనవోలు కోటను అతనికి బహుమానంగా ఇవ్వడం జరిగింది. అతడే కర్నూలు కోటను పటిష్టం చేసి, కొండారెడ్డి బురుజును నిర్మించి వుండవచ్చునని కొందరి అభిప్రాయం.

But, many historians are of the opinion that Kandanavolu Fort might have been constructed by Achyuta Devaraya, brother of Srikrishnadevaraya, between 1529-49. They would say that he himself might have constructed Kondareddy Buruzu and its name was Achyuthadevaraya Buruzu. What ever it is, there is no doubt that Kondareddy Buruzu was constructed during the ruling of Vijayanagara kings only.



కానీ అనేకమంది చరిత్రకారులు శ్రీకృష్ణదేవరాయల సోదరుడైన అచ్యుతదేవరాయలు 1529–49 మధ్య కందనవోలు కోటను కట్టించినట్లు అభిప్రాయ పడుతున్నారు. కొండారెడ్డి బురుజును నిర్మించినది గూడా అతనేనని దీని అసలుపేరు అచ్యుతదేవరాయ బురుజు అని తెలియజేస్తున్నారు. ఏది ఏమైనా విజయనగర రాజుల కాలంలోనే ఇది నిర్మించబడిందన్న విషయంలో మాత్రం ఎవరికీ ఎలాంటి సందేహం లేదు.

For the proofs, if we go and stand at the gate that goes to SP Office and look at the places on the Fort where there are small holes, we can observe the small pictures of Lion, Elephant, Horse that are related to Vijaya Nagara Kings.







దాని ఆధారాలకోసం మనం ఎస్పీ కార్యాలయానికి వెళ్ళే గేటు దగ్గర నిలబడి కోటపై గల చిన్న చిన్న రంధ్రాలున్న ప్రదేశాలను గమనిస్తే అక్కడ విజయనగర రాజులకు సంబంధించిన సింహం, ఏనుగు, గుర్రంలాంటి చిన్నచిన్న బొమ్మలను గమనించవచ్చు.

The entire Kandanavolu Fort, with the area of 3 sqkms and six feet height, was constructed in such a way that it would protect Kurnool not only from enemies but also from the floods of Tungabhadra and Hundry rivers. One deep trench was existing around the Fort. At present, all the walls of the fort were removed in road-widening exercises during the British period itself. From Tungabhadra side, even today, we can observe a tall wall along the coast of Tungabhadra river.





కందనవోలు కోట మొత్తం మూడు చదరపు కిలోమీటర్ల వైశాల్యంతో, ఆరడగుల ఎత్తుతో శత్రువులనుంచేగాక తుంగభద్ర, హంద్రీ నదుల వరదలనుంచి కాపాడుతూ నిర్మించబడింది. ఈ కోట చుట్టూ ఒక లోతైన కందకం గూడా వుండేది. ప్రస్తుతం కోటగోడలన్నీ నగర విస్తరణలో భాగంగా బ్రిటిష్‌వారి కాలంలో తొలగించబడ్డాయి. తుంగభద్రానదివైపు మాత్రం మనం ఇప్పటికీ తీరం వెంట ఎత్తయిన కోటగోడను గమనించవచ్చు.

There are some arguments over Kondareddy Buruzu, built by Achyutha Devaraya, getting its name. During 1602-1618 A.C, Bijapur Sultan's deputy, Abdul Wahab was ruling Kandanavolu. At that time, the polygar of Praathakota of Nandikotkur taluk challenged his authority. With this Abdul Wahab attacked Kondareddy, defeated him and imprisioned him in this 'Buruzu'. He died here itself. So, some people say that 'Kondareddy Buruzu' got its name after him only.

Some other people say that a patriot called Kondareddy disobeyed the authority of Britishers during their ruling and the britishers arrested him and kept him in this prison. So, they say that 'Kondareddy Buruzu' got its name after him. Some more people say that 'Kondareddy Buruzu' might have got its name after a person called Kondareddy of Kallur area.

అచ్యుతదేవరాయలు నిర్మించిన ఈ బురుజుకు కొండారెడ్డి బురుజు అనే పేరు ఎలా వచ్చింది అనే దానిపై కొన్ని వాదనలు వున్నాయి. క్రీ.శ. 1602-1618 మధ్యకాలంలో బీజాపూర్ సుల్తాన్ ప్రతినిధయిన అబ్దుల్ వహాబ్ కందనవోలును పరిపాలిస్తూ వుండేవాడు. ఆ సమయంలో నందికొట్కూరు తాలుకాలోని ప్రాతకోట పాలెగాడయిన కొండారెడ్డి ఇతని అధికారాన్ని ధిక్కరించడంతో అబ్దుల్ వహాబ్ కొండారెడ్డిని ఓడించి ఈ బురుజులోని కారాగారంలో బంధించాడట. అతను అక్కడే మరణించడంతో అతని పేరుమీద దీనికి కొండారెడ్డి బురుజు అనేపేరు వచ్చివుంటుందని కొందరంటారు.

మరికొందరు ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో అలంపూర్ తాలుకాలోని కొండారెడ్డి అనే దేశభక్తుడు వారి అధికారాన్ని ఎదిరించడంతో ఆంగ్లేయులు అతనిని పట్టుకొని ఇక్కడ బంధించారని, దానితో అతని పేరుమీద దీనికి కొండారెడ్డి బురుజు అనేపేరు వచ్చిందని చెబుతారు. అలాగే ఇంకొందరు కల్లూరు ప్రాంతానికి చెందిన కొండారెడ్డి అనే అతని పేరుమీద వచ్చిందని అంటారు.

In 1930 January, Gannavarapu Subbaramaiah had published one big research article in ‘Bharathi’ magazine about Kurnool District along with photos. In that, photos of so many constructions and their names were given. But, below the photo of Kondareddy Buruzu, the image of which immediately flashes in the minds of the people upon mentioning the name ‘Kurnool’, its name was not mentioned and simply written as “It is a old Bastion (Buruzu), police are guarding this by hiding of gunpowder in it”

1930 జనవరిలో భారతి పత్రికలో కర్నూలుజిల్లా గురించి ఫోటోలతో సహా ఒక పెద్ద పరిశోధనాత్మక వ్యాసాన్ని గన్నవరపు సుబ్బరామయ్యగారు ప్రచురించారు. అందులో అనేక కట్టడాల ఫోటోలు, వాటిపేర్లు ఇవ్వబడ్డాయి. కర్నూలు పేరు చెప్పగానే అందరి మనసుల్లో తళుక్కున కదలాడే కొండారెడ్డి బురుజు ఫోటో కింద మాత్రం ఎటువంటి పేరు ఇవ్వకుండా “ఇది ఒక పాత బురుజు, ఇందులో నల్లమందును దాచి పోలీసులు కాపలా కాస్తున్నారు” అని రాయడం జరిగింది.

ఫోటో తీసినవారు : స్వర్గీయ ఎం.ఎస్. కుప్పుస్వామి అయ్యర్, 1930



In a similar manner, in a book called ‘The awakening of India’ published by William Arthur Stanton in 1950, below the picture of Kondareddy Buruzu, its name was not written and simply mentioned as ‘Bastion (Buruzu) to the old Fort’.

If these things are taken into consideration, it appears that Kondareddy Buruzu might not have got its name before independence. If this is true, Kondareddy Buruzu might have got its name only after 1950’s. It’s a matter that has to be researched upon.

అలాగే దాదాపు నలభై సంవత్సరాలు కర్నూలు ప్రాంతంలోనే నివసించిన విలియం ఆర్థర్ స్టాంటన్ 1950లో అమెరికాలో ప్రచురించిన “ది అవేకనింగ్ ఆఫ్ ఇండియా” అనే పుస్తకంలో కూడా కొండారెడ్డి బురుజు చిత్రం కింద “Bastion to the old Fort” అని రాశారే గానీ కొండారెడ్డి బురుజు అని రాయలేదు.

వీటిని బట్టి ఆలోచిస్తే స్వాతంత్ర్యానికి పూర్వం ఈ కట్టడానికి కొండారెడ్డి బురుజు అనే పేరు లేదేమో అనిపిస్తుంది. అదే నిజమయితే 1950 తరువాతనే దీనికి ఆ పేరు వచ్చినట్లు చెప్పవచ్చు. ఇది పరిశోధించాల్సిన అంశం.

If the structure of Kondareddy Buruzu is studied, it exists totally in four parts. It was constructed by transporting the stones from Jagannatha Gattu, placing them one over the other and sticking them with the mixture of sand, lime and jaggery.





జగన్నాథగట్టు,
దానిపై గల కట్టడాలు.



కొండారెడ్డి బురుజు నిర్మాణాన్ని పరిశీలిస్తే దీనిని కర్నూలుకు దగ్గరలో గల జగన్నాథగట్టునుంచి రాళ్ళను తరలించి, ఒకదానిమీద ఒకటి పేరుస్తూ, ఇసుక, సున్నం, బెల్లం కలిపిన మిశ్రమంతో వాటిని అతికిస్తూ నిర్మించినట్లు తెలుస్తుంది. ఇది మొత్తం నాలుగు భాగాలుగా వుంది.

In the ground portion, a small room for the gaurd to stay, in the east side and broad steps at south-east side to reach the first floor are there. In the middle portion, four pillars are existing as a support to the Bastion (Buruzu). These appear to have been constructed during Nawab's period to see that the Bastion would not collapse.



క్రింది భాగంలో తూర్పువైపు కాపలాదారు వుండడానికి ఒక చిన్నగది, ఆగ్నేయంవైపు మొదటి అంతస్థుకు చేరుకోవడానికి వీలుగా విశాలమైన మెట్లు వున్నాయి. మధ్య భాగంలో నాలుగు స్థంభాలు ఈ బురుజుకు సపోర్టుగా వున్నాయి. వీటిని నవాబుల కాలంలో బురుజు పడిపోకుండా నిర్మించినట్లు చెబుతారు.

In the first floor, at both left and right sides, very narrow and steep steps are there to go to the second floor. The steps are so narrow and congested that people can go only one after another But not in crowd. Five big rooms for the soldiers to stay and two small rooms to keep the prisoners are there in this floor.





మొదటి అంతస్థులో కుడి, ఎడమలవైపు గుంపుగా కాకుండా ఒకొక్కరు చొప్పున వరుసగా ఎక్కడానికి వీలుగా ఇరుకైన మెట్లు కొంచం నిట్టనిలువుగా వున్నాయి. అక్కడ సైనికులు వుండడం కోసం ఐదు పెద్ద గదులు, ఖైదీలను బంధించడం కోసం రెండు చిన్న గదులు వున్నాయి.



One underground tunnel is there to escape, if the situation so arises. The tunnel is said to be upto Alampur, but digging a tunnel underneath Tungabhadra is difficult to undertake in those days. It might be up to the shore of Tungabhadra river or until SP Office. In the situations of escaping from the enemies, one can go through the tunnel upto Tungabhadra river, cross it and leave from there.

మధ్యలో అవసరం పడినప్పుడు బురుజునుంచి తప్పించుకోవడానికి వీలుగా ఒక సొరంగమార్గం వుంది. ఇది అలంపూరు వరకూ వుందంటారుగానీ... తుంగభద్రానది కిందనుంచి సొరంగ మార్గాన్ని నిర్మించడం అప్పట్లో అసాధ్యం. కోట వెలుపల తుంగభద్రానది ఒడ్డువరకుగానీ, ఎస్పీ కార్యాలయం వరకుగానీ వుండవచ్చు. శత్రువుల నుంచి తప్పించుకోవలసిన సందర్భాలలో సొరంగమార్గం ద్వారా అక్కడివరకూ వెళ్ళి అలాగే తుంగభద్రానది దాటి వెళ్ళిపోవచ్చు.

The second floor exists in a semi-circular manner in a small way. In this, seven rooms built for soldiers are there at the side of west. Opposite to them, some constructions with small holes exist to attack the enemies. These constructions have some space for soldiers. These constructions were built in such a way that the soldiers would attack the enemies through the holes protecting themselves.







రెండవ అంతస్థు అర్ధవలయాకారంలో చిన్న మార్గంలో వుంటుంది. ఇందులో పడమర వైపు సైనికుల కోసం నిర్మించిన ఏడు గదులున్నాయి. వాటికి ఎదురుగా శత్రువులను ఎదుర్కోవడానికి వీలుగా, చిన్నచిన్న రంధ్రాలుగల మనిషి పట్టేంత నిర్మాణాలున్నాయి. ఈ రంధ్రాల ద్వారా సైనికులు అవతలివారికి కనబడకుండా తమనుతాము రక్షించుకొంటూ, కోటపైకి వచ్చిన శత్రుమూకలపై దాడిచేయడానికి వీలవుతుంది.



In third floor, seven rooms built for soldiers white bricks and a spacious place opposite to them are there. Amidst this spacious place, a pillar of 168 feet height exists. It is said to be erected for the purpose of hoisting their flag during British period by Britishers. Not only that, one can observe enimies coming at a very distant place by climbing it.

మూడవ అంతస్థులో ఇటుకలతో నిర్మించబడిన ఏడు సైనిక గదులు, వాటిముందు విశాలమైన స్థలం వున్నాయి. స్థలం మధ్యలో 168 అడుగుల ఎత్తుగల పొడవైన స్థూపం వుంది. ఇది బ్రిటిష్ వారి కాలంలో వారి జెండా ఎగరవేయడం కోసం నిర్మించబడిందని అంటారు. అంతేగాక దీని పైకెక్కి సుదూరంగా వస్తున్న శత్రువులను గూడా పసిగట్టవచ్చు.

Once, an Iron ladder was there to climb this pillar. But it was removed later on to prevent the accidents from taking place. When Indian Government selected tall pillars in India to hoist the National Flag continuously, Kondareddy Buruzu is the one that got fifth place. The fluttering of tri-coloured flag on Kondareddy Buruzu is not going to be a distant dream.

ఒకప్పుడు ఈ స్థూపంపైకి ఎక్కడానికి వీలుగా ఒక ఇనుపనిచ్చెన వుండేది. కానీ ప్రమాదాలు జరగకుండా దానిని ఇటీవలే తీసివేశారు. భారత జాతీయ పతాకాన్ని నిరంతరం ఎగురవేయడం కోసం దేశమంతా కొన్ని ఎత్తయిన స్థూపాలను ఎన్నిక చేయగా కొండారెడ్డి బురుజు ఐదవ స్థానం పొందింది. త్వరలో ఇది మువ్వన్నెల జండా నిరంతర రెపరెపలతో కళకళలాడ బోతోంది.



ఫోటో తీసినవారు : స్వర్గీయ ధరణి రామచంద్రరావు



 కొండారెడ్డి బురుజు

